# గోవా కొనుటకు నిజాం యత్నం

## బ్రిటిషు రెసిడెంటుద్వారా జరిగిన యత్నాలు

మదరాసు, సెప్టెంబరు 23: "ఇత్తెహాదుల్ ముస్లిమీన్" అంటేముస్లిములకు నిజాం శాఖాసంస్థ, హైదరాబాదుని ఏలుచున్నది. అందు ముస్లిములందాల ప్రాబల్యం ఎక్కువ. ఇటీవల నిజాం రాజకీయ సలహాదారగు మాంక్టను గారియందు వట్టారియందు విశ్వాసరాహిత్య తీర్మానం గావించిరి. అది ఉపసంహరింప చేస్తానని నిజాం మాంక్టను గారికి బాసచేసి, అట్లు చేయలేకుంటెను. ఢిల్లీలో రాయబారాలు కాలయాపనకే గాని హృదయపూర్వకమయినవి కావు. బ్రిటిషు రెసిడెంటుద్వారా అమెరికావారి వద్ద కొన్ని బ్రెనుగను ఫాక్టరీలో ఆయుధాలు తయారుచేయుటకు, గ్వాలియర్ సంపాదించుకొనుటకు జరుగుతున్న యత్నాలని బ్రిటిషు రెసిడెంటు హెర్బర్టు, యిప్పటికీ నిజాం డబ్బు తింటూ ఊటీలో నున్నాడు. నిజాంకి గోవాను కొనియిచ్చుటకు 40,000 పౌనుల బేరం కుదిరింది." అని డి. జి. రాఘవేంద్రరావుగారు (బొలారం) నిన్న సాయంకాలం దక్షిణ మదరాసు ఆంధ్రసంఘం జరిపిన బహిరంగసభలో ఉపన్యసిస్తూ తెలిపిరి. శ్రీ బులుసు సాంబమూర్తిగారు అధ్యక్షత వహించిరి. చలపతీశ్వరరావుగారు స్వాగత వాక్యములు పలికిరి.

శ్రీ టి. వెంకట్రామశాస్త్రిగారు ప్రస్తుత పరిస్థితులగూర్చి సుమారొక గంట సవిస్తరముగ ఉపన్యసించిరి. ఒకే జాతికిచెందిన రెండు మతాలవారి సంఘర్షణలు, ఒకేదేశంలో రెండు జాతులవారి సంఘర్షణలు (ఆఫ్రికాలో) ఒకదేశం యింకో దేశాన్ని అణచియుంచి దోచుకోడం యీరీతి మూడుకాల సంఘర్షణలు యింకను ప్రపంచంలో జరుగుచున్నవి. బ్రిటిషువారు విధిలేక ఇండియా బర్మాలను విడచినా మలయా విడువలేదు. వారి సామ్రాజ్యకాంక్ష తీరలేదు. ఆఫ్రికాలో స్మట్సు తనకెంత యిష్టంలేకున్నా తన తెల్లజాతివారి వాంఛప్రకారం రంగుభేదాలను పాటించుచు, సంయుక్తరాజ్యాల సభానిర్ణయాన్ని కూడ ధిక్కరించెను. పాలస్తీనాలో యూదులను అరబ్బులను బ్రిటిషువారు అరబ్బులను రెచ్చగొట్టే విధానం అనుసరించుచున్నారు.

కనుక ప్రతి చోటను అశాంతి ప్రబలియున్నది. ఇకముందు అమెరికా రష్యాలకు యుద్ధం రాకతప్పదని శాస్త్రిగారు తెలిపిరి. ఇండియాలో మత సంఘర్షణలు బాపుటకు గాంధిమహాత్ముడు ఎంతో పాటుపడుచున్నాడు. కాని ఎదుటివాడు కత్తి ఎత్తి నరకుతాననంటూ వుంటే ధైర్యంగా నుండు మారిపోకని సలహా చెపుతాడు. అది సాధ్యంకాదు. ఎవరిమట్టుకువారుసహాయం చేసుకోవాలి. ఇండియా పాకిస్తానురెండూ యుద్ధానికిదిగుతేమాత్రం తిరిగి మహాభారత యుద్ధంవలె తిరిగి సోదరులే చంపుకొని సర్వనాశనమగును" అని తెలిపిరి.

భాషాప్రయుక్త రాష్ట్రాలగూర్చి తెల్పుచు, ఆంధ్ర రాష్ట్రం సర్వవిధములు స్వయంపోషకంగానుంది. కనుక వెంటనే ప్రత్యేకింపవచ్చును గాని, కేరళం కన్నడ రాష్ట్రాలు వేరగుటకష్టం. పందిరిలో తీగలను విడదీసినట్లు యీ భాషలవారిని వివిధ రాష్ట్రాలు సంస్థానాలనుండి విడదీయుట కష్టమనిరి.

జమీందారు రద్దు బిల్లుగూర్చి తెల్పుచు యీ చట్టం వివిధతరగతుల ప్రజల ఆర్థిక విధానాన్ని తారుమారుచేయునియున్నవని.

ఆప్పుడే హైదరాబాదునుండి వచ్చిన రాఘవేంద్రరావుగారు, అచటి పరిస్థితులగూర్చి తెల్పుచు, ముస్లిమేతరులందరు ప్రాణహానికి సిద్ధపై ప్రమాదకరమగు పరిస్థితులలో నివసించుచున్నారనిరి. ప్రతి హిందువుని యిల్లు సోదాచేసి ఆయుధాలుకాని కర్రలుగాని లేకుండా తీసుకున్నారు. అల్లా ఉద్దీన్ అనువారి పేర బ్రెనుగను ఫాక్టరీని 1½ కోటి రూపాయలకు నిజాంగారేర్పాటుచేస్తున్నారు. ముస్లిములందరికి ఆయుధాలు గలవు. ముందు గూండాలు హిందువులను కొట్టడం, తిరగబడితే పోలీసు మిలిటరీ కలసి హిందువులను చంపి, ఆస్తి నాశనం చేయుచున్నారు. అపుడు ప్రజలు భయపడి పారిపోవుచున్నారు. కర్నూలు జిల్లాలో గూడ ముస్లిముల యిండ్లలో ఆయుధాలు దాచియుంచిరి. మదరాసు ప్రభుత్వం వారు తగుచర్య తీసుకోవాలి. సర్ అక్బరు హైదరీనాటినుండి ఉద్యోగాలలో ముస్లిములే వుండునట్టు ప్లాను వేసిరి. బ్రిటిషు రెసిడెంటుద్వారా పార్లమెంటు సభ్యులను వశంచేసుకొని నిజాం స్వాతంత్ర్యం చట్టంలోనే పేర్కొనబడునట్లు చేయ యత్నించెను. అంత జరుగకపోయినా, ఇండియా స్వాతంత్ర్యచట్టంలో సంస్థానాలగూర్చి అస్పష్టంగా విడుదలజరిగెను. సర్ జఫరుల్లాగారు విదేశాలనుండి రాగానే

# కాలప్రభావాన్ని గుర్తించ లేని మైసూర్ దివాన్

## డా॥ పట్టాభి ప్రకటన

మద్రాసు, సెప్టెంబర్ 22: అఖిల భారత సంస్థాన ప్రజా మండలి అధ్యక్షుడు డా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు మైసూర్ సత్యాగ్రహమును గురించి ఈవిధంగా ప్రకటించారు.

"ఇతర సంస్థానములన్నిటికి ఆదర్శప్రాయముగా నుండవలసిన సంస్థానం, అన్నిటికన్న వెనుకబడివుండి, లోటుబాటుతో పురోగమిస్తూ ఉండడం విచారకరమైన విషయం. మహారాజా పరిపాలన క్రింద బాధ్యతాయుత స్వపరిపాలనాధికారం సంపాదించుకొనుటకు, అప్పటి కార్యకర్తల మార్గ తవలన, ప్రజలు బ్రహ్మాండమైన సత్యాగ్రహోద్యమం జరపవలసిరావటంవలన ఆ ఆగాధంగము తీవ్రతరమై, క్రోధకారణమౌతుంది. మహారాజాలు, దివానుల జాగీర్దార్ల చేతుల్లో కీలుబొమ్మలు. వారు అభివృద్ధిని రోధకులు; బ్రిటిషు ఇండియాలో అదృష్టవశాత్తు, యిక్కడ దుష్టపలచబడిపోతున్న, సివిల్ సర్వీసు ఉద్యోగులతో పోల్చదగినవారు దివానులు; అన్ని రాష్ట్రములలోను యిప్పుడు రద్దుచేయబడుతున్న జమీందారులవంటివారు సంస్థానములలోని జాగీర్దారులు. కాలక్రమప్రగతికి అనుగుణ్యంగా మారగల ప్రతిభావంతుడగు దివాన్ దొరకకపోవటం మైసూర్ దురదృష్టం. సంస్థాన కాంగ్రెసును బాధిస్తూ వుండటమే సర్ రామస్వామి మొదలియార్ గారి విధానము. తానింతకుముందు చేసిన ప్రకటనభావము, అంతరాగము బాధ్యతాయుత ప్రభుత్వమేనని ప్రకటిస్తున్న మహారాజా తదనుగుణ్యంగా తాత్కాలిక ప్రభుత్వమును, రాజ్యాంగ చట్ట నిర్మాణసంఘమును, వేరుగా, ఎందుకు ఏర్పరచరాదు? జయపూర్, గ్వాలియర్, ఇండూర్ సంస్థానము లీవిధానము అనుసరించినవికదా. అసలు విషయమేమంటే సర్ రామస్వామిమొదలియార్ బ్రిటిషు విదేశ పరిపాలనా పద్ధతిని కాపాడే శక్తి. మైసూర్ ఆయనకు విదేశంగా గోచరిస్తున్నది. ప్రతివిషయంలోను జాగు చేస్తూ, ఆయిష్టతతో మైసూర్ భారత రాజ్యాంగ పరిషత్తులో చేరినవిధము, ఇంకెక్కడా లేనటువంటి విధానము ననుసరించి, రెండు సభలనుండి విడివిడిగా సభ్యుల నెన్నుకొన్న పద్ధతి ఈయన విదేశభావనకే ద్యోతకం చేస్తున్నవి. ఒకమాత్రము నంగీకరించి, నిరవయోగం చేయటంకన్న, దానిని అంగీకరించకుండా వుండుటయే మేలు. అనుమానాస్పదమైన స్నేహీతంకన్న, ప్రత్యక్ష వైరమే మేలు. అంతరంగిక సంస్కరణలలో కూడా ఈఅశ్రితత్వము, లోటుపాటు కనిపిస్తూనే వున్నది. మైసూర్ లోని ప్రజానాయకులు తన కేవిధముగాను తీసిపోని ప్రతిభావంతులని దివాన్ గుర్తించాలి. ఈనాడు తాను జైలుగాను, వారు ఖైదీలుగాను వుండటం విధి చోద్యమే. ఈయన జైలరుగా ఎకకాలం ప్రవర్తిస్తారో, మహారాజాకు అంతహాని సంభవిస్తుంది. ప్రజాఉద్యమం దీర్ఘకాలంలోనైనా విజయంపొందక తప్పదనువది నగ్నసత్యం. అది విజయం పొందిన అప్పుడు నష్టపడునది మహారాజా. దివాన్, మరొక ఉద్యోగం చూసుకుంటాడు. ఈలోపుగనే మహారాజా, ప్రజలు ఏకమైతే, దివాన్ కు అపకీర్తి వాటిల్లుతుంది. సరియైన సమయంలో సక్రమంగా ఒడంబడిక చేసికొని ప్రజలను సంతృప్తిపరచితే, కీర్తి అంతా దివాన్ కే దక్కుతుంది. తిరువాన్కూరు ఆపనిచేయలేకపోయింది. మైసూరు అయినా ఆ పనిచేసి, మహారాజా, ప్రజలు దివాన్ లు సహకార సౌహార్దంతో మెలగుటకు అవకాశం యిస్తుందని నేను ఆశిస్తున్నాను."

వారిని ప్రధానిగా చేసి ఛటారీ గారిని పంపించేయాలని ముస్లిమ్ సంస్థ వారి యుద్దేశం. ఈసంస్థవారు జిన్నాగారి సలహాల ప్రకారం తీర్మానించి, నిజాంచేత అమలు జరిపిస్తున్నారు. జిన్నాగారు మూడేండ్ల క్రితం హైదరాబాద్ బహిరంగసభలో ఉపన్యసిస్తూ, ముస్లిమేతరులను తోడేపిక్కలిని నట్లు నలిపేయాలని హెచ్చరించి యుండెను. ఆ మాట స్థానికపత్రికలలో ప్రకటించేసరికి ఆసుకుండా ప్రకటించడం అన్యాయమనెను. ముస్లిం కుటుంబాలను హైదరాబాదుకి పంపుటకు మదరాసులో బొంబాయిలో ఏజెంటులను నిజాం నియమించెను" అని రావుగారు తెలిపిరి. ఇండియాకు పాకిస్తానుకి యుద్ధం వస్తే, హైదరాబాదు విషయంలో తేలగలదని టి. వి. వెంకట్రామ శాస్త్రిగారనిరి.

శ్రీ బులుసు సాంబమూర్తిగారు ముగింపు ఉపన్యాసంలో ప్రజారాజ్యం వచ్చేసింది, ప్రజలు మేల్కొన్నాక యీ రాజులు నిజాములుండరనియు, భాషాప్రయుక్త స్వతంత్ర రాష్ట్రాలు వెంటనే ఇండియాలో స్థాపింపబడవలెననియు, సూచించిరి. మనసాతేలిపువుదరిగారు వందనమర్పించుటతో సభముగిసింది.

# అగ్రరాజ్యాల విభేదాలు

## ఇండియా మధ్యేమార్గాన్ని అనుసరించే సూచన

ఫ్లషింగ్ మెడోస్ (న్యూయార్కు). సెప్టెంబరు 23: పాశ్చాత్యప్రజాస్వామ్య రాజ్యాలకు, సోవియట్ రష్యాకు మధ్య పరస్పర సహకారానికి తావు లేకుండా, వీటిని రెండు విభిన్నశత్రు శిబిరాలక్రింద విభజించగల తీవ్రమైన సమస్యలు పొడసూపినట్లు, ఐక్యరాజ్య సమితి సర్వసభ్య సమావేశ తొలిదశలోనే సుస్పష్టమైనాయి. పాశ్చాత్యరాజ్యాలకు సోవియట్ రష్యాకుమధ్య యేర్పడిన ఈ విభేదాల దోలికిపోక, ఏరాజ్యంవైపు మొగ్గుచూపక, మధ్యేమార్గాన్ని అనుసరించుటకు ఇండియా నిశ్చయించుకొన్నట్లు కనిపిస్తున్నది.

ఐక్యరాజ్యసమితికిచెందిన సంఘాలలో శక్తివంతమైన సాధారణసంఘ సమావేశంలో రెండు ప్రధానసమస్యలు ఓటింగుకు వచ్చినప్పుడు, ఓటింగులో ఇండియా పాల్గొనలేదు. తీవ్రవర్షకు గురియైన, వీటో అధికారప్రయోగసమస్యపై జరిగిన ప్రాథమిక చర్చలలో గూడా ఇండియా పాల్గొనలేదు. ఇక ఇటలీ సంధిఒడంబడిక సవరణ విషయము చర్చకువచ్చినప్పుడుకూడా (—ఈ సమస్యపైనే రష్యా, అమెరికా విభేదాలు మరింత హెచ్చైనాయి) ఇండియా లోపార్టీ అభిప్రాయాన్ని సమర్థించలేదు.

ఇలా యేపార్టీతోను యేకీభవించకుండా, మధ్యేమార్గాన్ని ఇండియా అనుసరించడం, మున్ముందు అధినవీన అభివృద్ధిక్రమంలో సహజంగా సఫలించే ఫలితమేనని, అనుభవజ్ఞులైన రాజకీయవేత్తలు అభిప్రాయపడుతున్నారు.

"ఏ ప్రతిపాదనలైనా మా ముందుకు వస్తే, స్వీయవిచక్షణాజ్ఞానాన్ననుసరించి, ఆ ప్రతిపాదనల సమర్థించడమో, మానివేయడమో చేస్తాం" అని ఇటీవల శ్రీమతి విజయలక్ష్మీపండిట్ స్పష్టీకరించింది. ఇండియా ఈ విధానాన్ని అనుసరించడంవల్ల, క్లిష్టసమస్య పరిష్కారంలభించగలదని, ముఖ్యంగా, అగ్రరాజ్యాలమధ్య సైమనస్యానికి, హేతువైన వివాదగ్రస్త సమస్యలు పొడసూపినప్పుడు, ఆ రాజ్యాలమధ్య రాజీకుదిర్చి ఆ సమస్యల పరిష్కారానికి దోహదమివ్వగల ప్రముఖపాత్ర ఇండియా నిర్వహించగలదని, రాజకీయ అభిజ్ఞులు అభిప్రాయపడుతున్నారు.

## అగ్రరాజ్యాల సహకార ఆవశ్యకత

### కార్యదర్శి విజ్ఞప్తి

ఫ్లషింగ్ మెడోస్, సెప్టెంబర్ 23. అగ్రరాజ్యాల్లో ఉన్న విభేదాలవల్ల ఐక్యరాజ్యసమితి చాలా కష్టాలపాలౌతున్నది కాని ఈవిభేదాలు ఇంకొక యుద్ధానికి దారితీసినట్లైతే, అది ఏమాత్రమూ సహించలేము. సంపూర్ణ సహకారంవల్లనే యుద్ధసమయంలో మనం అనేక పెద్ద సమస్యలను పరిష్కరించుకోగలిగాము. ఇప్పుడుకూడా అంతే పెద్ద సమస్యలే మనలను ఎదుర్కొంటున్నవి. యూరపు, ఆసియా ప్రజలు దారుణదుర్భాక్షలకు గురి అవుతున్నారు. ఆసియా ప్రజల్లో చాలమంది అనేక విధాల వ్యాధులవల్ల అలా పోతున్నారు. ఈ పరిస్థితుల్లో అంతా సహకరించకపోతే ప్రయోజనం ఉండదు" అని ఐక్యరాజ్యసమితి ప్రధాన కార్యదర్శి ట్రిగ్వేలీ నేటి సమావేశంలో ప్రత్యేక విజ్ఞప్తిచేశాడు.

## సమితిలో సభ్యత్వం

ప్రపంచశాంతికి వివిధదేశాలూ, చిన్న పెద్దవనే తారతమ్యం లేకుండా సహకరించటం ఆవశ్యకం. కాబట్టి శాంతిని వాంఛిస్తున్న అన్ని దేశాలకూ ఐక్యరాజ్యసమితిలో సభ్యత్వం ఇవ్వటం చాలముఖ్యం"

సమితి సభ్యత్వానికి వివిధదేశాలు పెట్టుకున్న దరఖాస్తులను అంగీకరించవలసినదని స్వీడన్ ప్రతినిధి ప్రతిపాదిస్తాడు. దీనిమీద గురువారంనాడు చర్చ జరుగుతుంది.

## కొరియా, ఇటలీలపై చర్చ

కొరియాసమస్యను అమెరికా సమితికి ప్రతిపాదించినందుకు అసమ్మతి తెలుపుతూ సోవియట్ ప్రతినిధి ఆండ్రీ విషిన్స్కీ ఈ విధంగా వాదించాడు. "కొరియా విషయమై విచారణ చేసేందుకు ఐక్యరాజ్యసమితికి అధికారంలేదు. ఆ సమస్య కేవలం మిత్రరాజ్యాలకుమాత్రమే సంబంధించినది. ఆ విషయమై సోవియట్, అమెరికన్ సంప్రతింపులు భగ్నం కావటానికి అమెరికా కారకురాలు."

ఆస్ట్రేలియా ప్రతినిధి ఇటలీ సంధి ఒడంబడికలో మార్పులు తీసుకురావలెనని ప్రతిపాదించాడు. దానికి తీవ్రంగా ప్రతిఘటిస్తూ విషిన్స్కీ ఈవిధంగా వాదించాడు.

"ఐక్యరాజ్యసమితి ప్రణాళిక ననుసరించి అంతర్జాతీయపు ఒడంబడికలలో జోక్యం కలగచేసుకునే హక్కు సమితికి లేదు. రాజకీయ దృష్ట్యాకూడా ఒడంబడికను మార్చుమనటం తప్పే అవుతుంది.

ఈ ఒడంబడిక న్యాయంగానూ, ఉదారంగానూ ఉన్నది. దీనిని వినియోగించుకొని లాభం పొందటం ఇటలీ ప్రజలమీదనే ఉన్నది. అమెరికా ఈ ప్రతిపాదనను ఇలా పరచటం చాల విచారకరంగా వున్నది. యుద్ధానంతరం తాను చేసుకున్న ఒడంబడికల బాధ్యతలను అమెరికా సరిగా గుర్తించినట్లు లేదు. దీనికన్న అంతర్జాతీయపు ఒడంబడికలను అమెరికా పాటించలేదనే స్పష్టమవుతున్నది. ఇదే ధోరణితో ఇంకా ప్రవర్తిస్తే, మిగిలిన పెద్ద సమస్యలు కూడా పరిష్కరించటం కష్టం."

## అబిసీనియా సమర్థన

ఇటలీ సంధి ఒడంబడికను సవరించకూడదంటూ అబిసీనియా ప్రతినిధి అకిలే వోల్డ్ ఉద్రేకంతో ఇల్లా అన్నాడు: "అబిసీనియా యుద్ధ సమయంలో అనేకమంది అబిసీనియన్, స్త్రీలను, శిశువులను ఇటలీ సైనికులు నరికివేసి తగలబెట్టారు. ఈ ఘోరకృత్యాలు మరచిపోయినప్పుడే ఇటలీని కనికరించవలసినదని మీరు అనకలుగుతున్నారు.

అమెరికా, ఆస్ట్రేలియాల ప్రతినిధులు ఈ ఒడంబడికను సవరించాలనే అన్నారు. పాలస్తీనా ప్రత్యేక సంఘంలో సోవియట్ ప్రతినిధిగా సెమెన్ జరప్కిన్ నియమించబడ్డాడు. ఇతడు వాషింగ్టన్ లోని రష్యన్ రాయబారికి సహాయకుడు.

# ఇండోనీసియాలో 'త్వరలో' కొత్త కేంద్రవ్యవస్థ ఏర్పడుతుందట

## డచ్చిపార్లమెంటులో ప్రధాని ప్రకటన

హేగ్, సెప్టెంబరు 23: ఇండోనీసియాలో ఒక నూతన కేంద్ర పరిపాలక వ్యవస్థను 'కొద్దికాలంలో' నిర్మించాలని డచ్చి ప్రభుత్వం నిశ్చయించింది. ఈ వ్యవస్థే తరవాత తాత్కాలిక ఫెడరల్ ప్రభుత్వంగా పరిణమిస్తుంది." అని డచ్చి ప్రధాని డా॥ బూయిబేల్ ఈ వేళ డచ్చి పార్లమెంటులో ప్రకటించాడు.

ఈ పథకాన్ని అనుసరించి ఈక్రింది మార్పులు జరుగుతవి:

(1) ఇండోనీసియా గవర్నర్ జనరల్ వాన్ మూక్ కు 'అధికారభారాన్ని' తగ్గించే నిమిత్తం, ప్రభుత్వ వ్యవహారాల్లో కొంత బాధ్యత వహించటానికి డచ్చిప్రభుత్వం ఒక ప్రత్యేక సంఘాన్ని నియమిస్తుంది.

(2) లింగాడ్జటి ఒడంబడికను రిపబ్లిక్ తో చేయుచున్న డచ్చికమిషన్, జనరల్ ను రద్దుచేస్తుంది. ఈ కమిషన్ జనరల్ లోని ఇద్దరు సభ్యులు డచ్ ఇండోనీసియన్ ప్రభుత్వానికి సలహాదార్లుగా వుంటారు.

(3) ప్రస్తుతం డచ్చి ఆక్రమణకింద వున్న భాగాల రక్షణబాధ్యతను డచ్చివారు ఇండోనీసియన్లు కలసివున్న మిశ్రమపు పోలీసుకు అప్పగిస్తారు.

## అమెరికా "సుముఖత"

అమెరికా ప్రభుత్వంతో సంప్రతించటానికి వెళ్లిన వాన్ మూక్ ఈ వేళ బటేవియాకు తిరిగివచ్చారు. ఇండోనీసియా వ్యవహారంలోవున్న చిక్కులను అంతకంతకూ యెక్కువగా తెలుసుకోగలుగుతున్నారని అతడు అన్నాడు.

ఈ వ్యవహారాన్ని పరిష్కరించేందుకు భద్రతాసంఘం ఒక మధ్యవర్తిసంఘాన్ని నియమించింది. అందులో అమెరికా, బెల్జియం, ఆస్ట్రేలియాల ప్రతినిధులు వున్నారు. వీరి అధ్యక్షతన డచ్చి ఇండోనీసియన్ల సంప్రతింపులు సింగపూర్లో తిరిగి ప్రారంభం కావచ్చును. మధ్యవర్తిసంఘ కార్యక్రమం యుద్ధవిరమణ పరిశీలనకై ఏర్పడ్డసంఘం నివేదికపై ఆధారపడి వుంటుంది. ఈ సంఘంలో బటేవియాలో ఉన్న 6 తటస్థదేశాల కౌన్సల్ లు వున్నారు.

## నానావదారు సంస్థానము పాకిస్తానులో చేరినది

కరాచి, సెప్టెంబర్ 23: కథియవార్ నందలి నానావదార్ సంస్థానము, ప్రవేశపత్రముపై సంతకముచేసి పాకిస్తాను అధినివేశములో చేరెనని పాకిస్తాను విదేశాంగశాఖవారు నేడు ప్రకటించిరి.

# ఐక్యరాజ్య సమితి

## ప్రపంచశాసనసభగా పనిచేయాలి

### ఐన్ స్టయిన్ హెచ్చరిక

న్యూయార్కు, సెప్టెంబరు 22: "వినంతరం భద్రతాసంఘ సభ్యులు వీటో అధికారాన్ని ప్రయోగించుటవల్ల ఆ సంస్థ శక్తివిహీనమైపోయినది. ఐక్యరాజ్యసమితికి ప్రపంచశాసనసభ హోదావచ్చి, భద్రతాసంఘం మీద అధికారం కలిగివుంటే, ప్రపంచంలో శాంతి ప్రియదేశాలకు యుద్ధ ప్రమాదాన్ని అరికట్టేశక్తి వస్తుంది." అని ప్రఖ్యాత శాస్త్రజ్ఞుడు ఆల్బర్టు ఐన్ స్టయిన్ వివిధదేశాల ప్రతినిధివర్గ నాయకులనూ ఒక ప్రకటన ద్వారా హెచ్చరిక చేస్తున్నారు. చరిత్రలో కనివిని ఎరగని ఘోరప్రమాదానికి ప్రపంచం లోనయే పరిస్థితులు ఏర్పడ్డవి. ఈస్థితిలో ఐక్యరాజ్యసమితి ఒక్కటే తరణోపాయం. కాబట్టి దాని అధికారం ప్రబలి భద్రతాసంఘం దానిచేయి కిందకి వస్తేనే తప్ప లాభలేదు. సమితిసభ్యులను ప్రభుత్వాలు నియమించేదానికన్నా, ఆ దేశాల ప్రజలే ఎన్నుకొంటే చాలా ఉత్తమం."

# గాంధిజీ హెచ్చరిక

[1వ పేజీ తరువాయి]

నిర్మించుకోన్న ఆయా గ్రామాలనుండి వీరందరూ ఎందుకు వచ్చివెయ్యాలి. మిగిలిన హిందూసిక్కులకైనా పాకిస్తాన్ ప్రభుత్వం తగిన రక్షణ ఇవ్వాలి. ఉభయ ప్రభుత్వాలూ తమ తమ అల్పసంఖ్యాక వర్గాల రక్షణకై కృషిచేస్తూ ఎదుటివారి మండి వారి అధీనంలో ఉన్నవారికి రక్షణ కాలించడం వాటివిధ్యుక్తధర్మం. స్వస్థలవిడిచి శాశ్వతంగా వెళ్ళిపోవలసిన అవసరం ఏ వ్యక్తికీ రాకూడదనేదే మేలని నా ఉద్దేశం. హైర్యంతో చనిపోవడానికి భగవంతునిలో విశ్వాసం ఉంటే చాలు, మరే రక్షణా అక్కరలేదు. నేను పాకిస్తానుకు రక్షణలేకుండానే వెళ్తాను. నాకు దైవమే రక్షకుడు. ఎవరిచేతిలోనైనా సరే నవ్వుతూ చనిపోవడానికి నేను సిద్ధంగా ఉన్నాను. అల్లా చనిపోతే అందరికి సలహా ఇచ్చినట్లుగా నేను ఆచరించినవాణ్నే అవుతాను. కాని ఒక్క హెచ్చరిక. పాకిస్తాన్ లో శాంతిస్థాపనా యత్నంలో నేను మరణించినట్లయితే ఇక్కడివారెవ్వరూ ఉద్రిక్తులు కాకూడదు అల్లా కావటం నాకిష్టంలేదని చెప్పే నా నిర్ధారం."

# కార్యవర్గ సమావేశం

(1వ పేజీ తరువాయి)

చాలా భయంకరమైంది ఉభయదేశాల్లోనూ పరస్పరంగా వీరి రాకపోకలు అరికట్టకపోయినట్లయితే ప్రజల్లో భయోత్పాతం దేశం నలుమూలలా ప్రాకిపోవు. 7 కోట్ల ప్రజలను ప్రభుత్వ సహాయంతో ఒకచోటినుంచి మరోకచోటికి మార్చవలసివస్తుంది. ఇదేమంత సామాన్యమైన విషయం కాదు. 1920 లో టర్కీ గ్రీసుల మధ్య 10 లక్షల ప్రజలు ప్రభుత్వ సహాయంతో ప్రశాంత పరిస్థితులలో మారినప్పుడు 1 కోటిపౌనులు ఖర్చుఅయ్యాయి. ఈ లెక్కలో మనదేశంలో ఉభయప్రభుత్వాలూ ఆపలేనయే ఖర్చునుగూర్చి ఆలోచిస్తే ఆహారోత్పత్తి మొదలైన అత్యవసర కార్యాలనుగూడా స్వస్తిచెప్పి ఈ వలస కార్యక్రమాన్నే సాగించవసి వస్తుంది అందుచేత ఇప్పుడు అనివార్య పరిస్థితులలో జరిగిన జనాభామార్పు ఆపుజేసి ఇక మీదనైనా ప్రజల కిటువంటి భయం కలగకుండా చెయ్యవలసిన బాధ్యత ఉభయ ప్రభుత్వాలమీదా ఉన్నది.

ఇండియా పాకిస్తాన్ అధినివేశాలమధ్య ఇకముందు మంత్రివర్గహోదాలో పరస్పర సంప్రతింపులు జరుగుతూ ఉండాలన్న సూచనను కార్యవర్గం అభినందించినట్లు తెలుస్తున్నది.

అల్పసంఖ్యాకులవిషయంలో ప్రభుత్వ విధానాన్ని సుస్పష్టం చెయ్యడం చాలా అవసరమని అధికసంఖ్యాకులు భావిస్తున్నారు. ప్రభుత్వవిధాన ప్రకటలం ఈక్రింది అంశాలను ఉద్ఘాటించాలని చాలామంది అభిప్రాయపడుతున్నట్లు తెలుస్తున్నది. (1) దేశంలో ప్రతివ్యక్తి భారతీయుడే! భారతీయుల కందరికీ ప్రభుత్వం సమాన రక్షణ యిస్తుంది. అయితే ప్రతిపౌరుడూ ప్రభుత్వం యెడల సంపూర్ణ రాజభక్తిశ్రద్ధా విధేయతలు చూపాలి. (2) అస్తినిగాని వ్యక్తినిగాని ఒకరికి చెందిన వాటిని బలాత్కారంగా స్వాధీనం చేసుకోవడం తప్పని సర్కారు అంగీకరించదు. యావద్భారత ప్రభుత్వం ఆయాస్తులకు ప్రతినిధి యితులకు.

సాయంత్రం 5-40 నం కార్యవర్గసమావేశం రేపటికి వాయిదా వెయ్యబడింది. రేపు మధ్యాహ్నం రెండున్నర కు తిరిగి సమావేశం జరుగుతుంది. ఒక ప్రశ్నకు సమాధానం చెప్తూ "ప్రస్తుతంలో కాలమేఘాలు చెదిరిపోతున్నా పూర్తి కార్యవర్గ సమావేశం జరుగుతూనే ఉంటుంది" అని ప్రధాన కార్యదర్శి శంకరరావ్ గారు అన్నారు.

## గిద్వానీ నివేదిక

న్యూఢిల్లీ, సెప్టెంబరు 24: సింధులోని విద్వేష పరిస్థితిగూర్చి కార్యవర్గ సభ్యులకు సింధు కాంగ్రెసు అధ్యక్షుడు చోయిత్ రామ్ గిద్వానీగారు తెలియజేశారట. ఈ విషయంలో గిద్వానీగారు భారత తాత్కాలిక మంత్రులతోగూడా సంప్రతిస్తారని తెలుస్తున్నది.

"దేశ విభజన మత సమస్యను పరిష్కరించ పోవటమేకాక పరస్పర విద్వేషం ప్రకోపించడానికి దోహదమైంది. పోలీసు, సైనిక, సేవా శాఖలన్నింటినీ మతప్రాతిపదికపై విభజించడంవల్ల ఉభయాధినివేశాల్లోనూ అల్పసంఖ్యాకులు తమకు ఇక రక్షణ ఉండదని భయపడిపోతున్నారు. ఈ సమస్యా పరిష్కారానికి అల్పసంఖ్యాకులు తమంతట తాముగా ప్రభుత్వ సహాయంతో వలస వెళ్లడమే సరియైన మార్గం. ఇది ఎంత భయంకరంగా కనిపించినా ధైర్యంతో ఎదుర్కోక తప్పదు." అని గిద్వానీ గారు అన్నారు. ఆయన ఇంకా ఇల్లా అన్నారు:

"ఇండియాకు స్వాతంత్ర్యం విభజన అంగీకరించడంవల్ల వచ్చింది. కాని దీనితో ఇన్ని కష్టాలు వచ్చాయి. అందుచేత అల్పసంఖ్యాకులకు సరియైన రక్షణ ఇవ్వడం ఇండియా ప్రభుత్వ పవిత్రధర్మం. ఇప్పుడు సమావేశమవుతున్న కాంగ్రెసు కార్యవర్గం ఈ సమస్యను త్వరితంగా పరిష్కరించాలి. ఏవో అతుకులు పెట్టి ఊరుకోవటంవల్ల లాభంలేదు.

## అమెరికా పత్రికలలో ఇండియా వార్తలు

వాషింగ్టన్, సెప్టెంబర్ 23: వాషింగ్టన్ లోని ఇండియా రాయబారి కార్యాలయ మోత్సగి బి. ఆర్. సేన్ పత్రికా విలేఖరుల సమావేశంలో ఈవిధంగా ప్రకటించాడు:

చాలా అమెరికన్ పత్రికలలో ఇండియాలోని మతకలహాలకు అనవసరంగా అపరిమితమైన ప్రాముఖ్యం ఇస్తున్నారు. దీనివలన వాస్తవపరిస్థితులకు భిన్నమైన అభిప్రాయాలు కలుగుతున్నవి. కల్లోలానుగురించిన వార్తలకేకాని వాటిని అణచటానికి ఇండియా, పాకిస్తాన్ ప్రభుత్వాలు చేస్తున్న ప్రయత్నాలకుగాను ప్రాముఖ్యమివ్వటంలేదు. అంతమాత్రంచేత ఇండియా శక్తులమీద సెన్సారు విధించదు. అతిగా వ్యాపించిన సందేహాలు నిరాధారమనవి. అంతేకాకుండా ఆ కలహాలను పరిశీలించటానికి ఐక్యరాజ్యసమితి సిద్ధమైతే ఇండియాకు ఏ అభ్యంతరమూ వుండదు.

## కాశ్మీరు ఇండియను యూనియను లోచేర నిశ్చయించలేదట

జమ్మూ, సెప్టెంబరు 23

కాశ్మీరు సంస్థానము ఇండియను యూనియనులో చేరనిశ్చయించెనని కొన్ని పత్రికలు ప్రచురించినవార్త నిజముకాదని జమ్మూ, కాశ్మీరు ప్రభుత్వమువారు నేడు ప్రకటించిరి. ఉభయ అధినివేశములతో కాశ్మీరు యథాతథపు ఒడంబడికలు గావించుకొనునని ఆగస్టు 12 తేదిన గావించబడియుండిన ప్రకటన నిలచియున్నదని ప్రకటన తెలుపుచున్నది అ. ప్రె.

# బొంబయి బట్టలమిల్లు పనివారి సమ్మె

## 28 మిల్లుల మూసివేత

బొంబాయి, సెప్టెంబరు 23: బట్టల మిల్లులలో ఒకశాఖ పనివారు సమ్మె చేయుటవల్ల నేడు నగరములో 28 బట్టల మిల్లులు పూర్తిగా మూసివేయబడెనని విశ్వసనీయ వర్గములద్వారావచ్చిన కట్టకడపటివార్త తెలుపుచున్నది. మరియొకశాఖ పనివారు సమ్మెకారులలో చేరిరి. ఇతర మిల్లులపనివారు వీరియెడల సానుభూతి చూపుటకై సమ్మెచేసిరి. దాదాపు ఒక లక్షమంది పనివారు పనులులేకుండా నున్నారని అంచనా వేయబడుచున్నది.

## మైసూరులో కల్లూరి సుబ్బారావుగారి సత్యాగ్రహం

చెన్నపట్నం, సెప్టెం 23: మైసూరు ప్రజోద్యమ సహాయానికి ఆంధ్రకాంగ్రెస్ వారు నియమించిన సహాయక సంఘాధ్యక్షులు శ్రీ కల్లూరి సుబ్బారావుగారు, మహాత్మాగాంధీ జన్మదినమైన అక్టోబరు 2 వ తేదిన మైసూరులో సత్యాగ్రహము చేయుదురని ఆ ప్రభుత్వమువారికి తెలియజేసినట్లు తెలిసినది.

